# బిస్మిల్ - అష్ఫాఖ్

(హిందూ - ముస్లిం ఐక్యతకు ప్రతిరూపాలు)



సయ్యద్ నశీర్ అహమ్మద్

# బిస్మిల్-అష్ఫాఖ్

(హిందూ-ముస్లిం ఐక్యతకు ప్రతిరూపాలు)

సయ్యద్ నశీర్ అహమ్మద్

ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్
ఉండవల్లి - 522501

# బిస్మిల్ - అష్ఫాఖ్

BISMIL - ASHFAQ


## సయ్యద్ నశీర్ అహమ్మద్

Syed Naseer Ahamed





ప్రచురణ సంఖ్య : 13

ప్రథమ ముద్రణ : డిసెంబర్, 2015

ముఖచిత్రం : నలబోతుల జయరాజు, వినుకొండ

ముద్రణ : జయదీప్తి గ్రాఫిక్స్, వినుకొండ.

ప్రతులకు :

**ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్**

3-506, అప్నాషుర్, ఉండవల్లి సెంటర్-522501

తాడేపల్లి మండలం, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్

సంచారవాణి : 9440241727.

E Mail: syednaseerahamed2015@gmail.com,

aazadhouseofpublications@gmail.com

**మూల్యం : 10-00**

(PDF file of this booklet will be mailed to the interested readers on request to syednasserahamed2015@gmail.com, aazadhouseofpublications@gmail.com)

# మామాట

**భా**రత స్వాతంత్ర్యసమరంలో అగ్నిశిఖలుగా పేర్కొనదగిన విప్లవకారులు శ్రీ పండిత రాంప్రసాద్ బిస్మిల్, శ్రీ అష్ఫాఖుల్లా ఖాన్. ఈ ఇరువురు ఉత్తరప్రదేశ్ రాష్ట్రం షహరాన్‌పూర్‌లో జన్మించారు. అక్కడి అబ్బీరిచ్ మిషన్ ఉన్నత పాఠశాలలో చదువుకున్నారు. చిన్ననాటి నుండి ఆంగ్లేయుల పట్ల వ్యతిరేకత పెంచుకున్న బిస్మిల్-అష్ఫాఖ్ ఉన్నత పాఠశాల విద్యార్థులుగా జాతీయోద్యమంలో పాల్గొన్నారు. 1922 ఫిబ్రవరి 9న ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని చౌరీ-చౌరా పోలీసుస్టేషన్ ను ఆగ్రహించిన ప్రజలు తగులబెట్టారు. ఈ దుస్సంఘటన దృష్ట్యా మహాత్మాగాంధీ సత్యాగ్రహ ఉద్యమాన్ని విరమించారు. ఆ నిర్ణయం రుచించని శ్రీ బిస్మిల్, శ్రీ అష్ఫాఖ్ లాంటి యువకులు సాయుధపోరాటం బాట పట్టారు. ఆ క్రమంలో శ్రీ బిస్మిల్ నేతృత్వంలో ఏర్పడిన 'హిందూస్థాన్ రిపబ్లిక్ అసోసియేషన్'లో శ్రీ అష్ఫాఖ్ భాగస్వామి అయ్యారు. ఈ విప్లవ దళం నిర్వహించిన కార్యక్రమాలలో అష్ఫాఖుల్లా ఖాన్ ప్రధాన భూమిక నిర్వహించారు.

1925 ఆగస్టు 9న 'హిందూస్థాన్ రిపబ్లిక్ అసోసియేషన్' నిర్వహించిన 'కాకోరి రైలు' సంఘటన ఆంగ్ల అధికారుల గుండెల్లో గుబులు రేపింది. ఈ సంఘటనకు శ్రీ బిస్మిల్ నేతృత్వం వహించగా శ్రీ అష్ఫాఖ్ మరో 8 మంది విప్లవకారులు ప్రధాన పాత్ర నిర్వహించారు. ఆ సంఘటన తరువాత ఆంగ్ల ప్రభుత్వం విప్లవకారుల మీద విరుచుకపడి పలువుర్ని అరెస్టు చేసి విచారణ జరిపింది. ఈ విచారణలో శ్రీ బిస్మిల్ శ్రీ అఫ్ఫాఖ్‌లతోపాటుగా శ్రీ రాజేంద్ర లహరి శ్రీ ఠాకూర్ రోషన్ సింగ్ లకు ఆంగ్ల న్యాయస్థానం ఉరిశిక్షలు విధించింది.

శ్రీ బిస్మిల్ ఆర్యసమాజికుడు కాగా శ్రీ బిస్మిల్ ఇస్లాం ధర్మపరాయణుడు. మాతృభూమి విముక్తి పోరాటానికి అంకితమైన ఈ వేర్వేరు మతస్థులకు మతం, ధార్మిక భావాలు ఏ మాత్రం అడ్డు రాలేదు. ఆ రోజుల్లో బిస్మిల్-అష్ఫాఖ్ హిందూ-ముస్లిం ఐక్యతకు ప్రతిరూపాలుగా నిలిచారు. ఒకరికోసం మరొకరు ప్రాణ త్యాగాలకు సిద్ధపడ్డ ఈ యువకులు ఆనాటి ప్రాణమిత్రులకు, విప్లవకారులకు ఆదర్శమయ్యారు. భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో స్ఫూర్తిదాయక సంఘటనగా పేర్కొన్న 'కాకోరి రైలు సంఘటన' నేర భారాన్ని పూర్తిగా తన నెత్తిన వేసుకుని శ్రీ రాంప్రసాద్ బిస్మిల్‌ను ఉరిశిక్ష నుండి తప్పించడానికి అష్ఫాక్ ప్రయత్నించారు. ఈ ఇరువురు మిత్రులు మాతృభూమి విముక్తి కోసం ప్రజలంతా ఏకం కావాలని పిలుపునిచ్చారు. 1927 డిసెంబర్ 19న ఉరిశిక్ష అమలు జరగనున్నదనంగా డిసెంబర్ 16న ఈ ప్రాణమిత్రులు మాతృభూమి విముక్తి కోసం, భారతీయుల ఉజ్వల భవిష్యత్తు కోసం మతం, కులం, ప్రాంతం లాంటి అవరోధాలను తొలగించుకుని ఐక్యంగా ముందుకు సాగాలని అజరామరమైన పిలుపునిస్తూ భరతమాత ముద్దుబిడ్డలు శ్రీ అష్ఫాఖుల్లా, శ్రీ బిస్మిల్ అమరులయ్యారు.

ఈనాడు మన దేశంలో ప్రస్తుతం సాగుతున్న 'సహనం-అసహనం' వివాదాలు, ఆ వివాదాల్లో నుండి పుట్టుకొస్తున్న సంఘర్షణ వాతావరణం మనకు ఏమాత్రం మంచిది కాదు. ఈ నేపథ్యంలో మన దేశంలోని ప్రధాన సాంఘిక జనసముదాయాల మధ్య అఘాతం ఏర్పడి,

తద్వారా అవాంఛనీయ వాతావరణం అలముకోగల పరిస్థితులు కన్పిస్తున్నాయి. ఈ సంక్షుభిత వాతావారణం అమరయోధుల ఆక్షాంక్షలను విరుద్దం. మాతృభూమి విముక్తి కోరుతూ, దాని ఉజ్వల భవిష్యత్తును ఆకాంక్షిస్తూ ఉరి(తాళ్ళను పూల హారాలుగా స్వీకరించిన ఆ విప్లవకారుల మనోవాంఛలకు పూర్తిగా వ్యతిరేకం.

ఈ విషమయ వాతావరణం నుండి మనల్ని మనం విముక్తం చేసుకోవాలి. ప్రస్తుతం మనల్ని చుట్టుముడుతున్న పలు సాంఘిక, ఆర్థిక, రాజకీయ అరిష్టాల విషాదం నుండి విముక్తం గావించుకుని, భవ్యభారత నిర్మాణం దిశగా పరుగులెత్తాలంటే అలనాటి యోధుల త్యాగాలను, పోరాట పటిమను మనం ఆదర్శంగా తీసుకోవాలి. ఆ వీరపుత్రుల ఆకాంక్షలకు అనుగుణంగా ఐక్యంగా నిలవాలి. మతం, కులం, ప్రాంతాలకు అతీతంగా మనం ఏకమై ముందుకు సాగాలి. ఆ దిశగా ముందుకు సాగటానికి తగిన విధంగా స్ఫూర్తిని ఇచ్చేందుకు ఉపయుక్తం కాగలదన్న భావనతో 'బిస్మిల్–అష్ఫాఖ్' చిరుపొత్తాన్ని తెలుగు పాఠకులకు అందించాలనుకున్నాం.

మా ఆలోచనకు తగ్గట్టుగా ఆదర్శనీయులగు బిస్మిల్–అష్ఫాఖ్ ఐక్యతాభావజాలానికి చరిత్రకారులు శ్రీ సయ్యద్ నశీర్ అహమ్మద్ అక్షరరూపం కల్పించారు. ఈ రచనకు పుస్తక రూపం కల్పించడానికి శ్రీ షేక్ హుస్సేన్ (Ex MLC Poet and Story Writer, Kadapa) ఆయన సన్మిత్రులు శ్రీ టి శివ శంకర్ (Retired Police Officer), శ్రీ యం. కిషోర్ కుమార్ (Vice President: Youthwelfare AP, Vijayawada) ఆయన మిత్రులు శ్రీ యం. ఫారూఖ్ షుబ్లి (President: Youthwelfare AP, Cheif patron: YWTS, Vijayawada), శ్రీ షేక్ మునీర్ అహ్మద్ (President: Muslim Development Society, Vijayawada) ఆయన సన్నిహితులు శ్రీ కె. రవి కాంత్ కుమార్ (Shree Squaare, A Boutique Hotel, Vijayawada), శ్రీ ఇరుగు గురుస్వామి (Senior Advocate, Thirupathi) ఆయన సన్మిత్రులు శ్రీ సయ్యద్ షంషేర్ (President: Aam Insaf Muslim Samaj (AIMS), Thirupathi), శ్రీ సయ్యద్ జలాలుద్దీన్ జఫర్ (President : Youthwelfare, Telangana, Hyderabad) ఆయన ఆత్మీయులు శ్రీ గట్ల సంతోష్ (Joint Secretary: Youthwelfare, Telangana. Hyderabad) అవరసరమగు ఆర్థికతను చేకూర్చారు.

ఈ వదాన్యుల ఆర్థిక సహాయం వలన ప్రచురితమైన ఈ 'బిస్మిల్–అష్ఫాఖ్' పుస్తకాన్ని ఆంధ్రప్రదేశ్–తెలంగాణ రాష్ట్రాలలోని అన్ని జిల్లాల పాఠకులకు ఉచితంగా అందించాలని మా ప్రయత్నం. ఈ మేరకు డిసెంబర్ 19న ఈ పుస్తకాన్ని తెలుగు రాష్ట్రాలలో ఆవిష్కరింప జేయాలన్న మా పిలుపుకు మంచి స్పందన రావడంతో 'బిస్మిల్–అష్ఫాఖ్' ప్రచురించి తెలుగు పాఠకులకు అందిస్తున్నాం. ఈ సందర్భంగా మా ప్రయత్నంలో అన్ని విధాల సహకరించిన వదాన్యులకు, మిత్రులు ప్రతి ఒక్కరికి మా ధన్యవాదాలు తెలుపుకుంటున్నాం.

**– ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్.**



**భా**రత జాతీయోద్యమ చరిత్రలో 'అగ్నియుగం'గా అభివర్ణించబడిన విప్లవోద్యమ కాలంలో మాతృభూమి విముక్తి కోసం సాగిన సాయుధపోరాటం నాటి సాహస యోధులు పండిత రాంప్రసాద్ బిస్మిల్, అష్ఫాఖుల్లా ఖాన్‌ల మధ్య ఏర్పడిన స్నేహబంధం ఎంతో త్యాగపూరితమైంది. ఆ అపూర్వ స్నేహం ఆ నాటికి ఈనాటికి ఎంతో ఆదర్శనీయమైనది.

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ కాలం ముందు నుండి వీరపుత్రులను అందిస్తున్న ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని షాజహాన్‌పూర్‌లో 1900 సంవత్సరం అక్టోబరు 22న విద్యాధిక– సంపన్న జమీందారి కుటుంబంలో అష్ఫాఖుల్లా ఖాన్ జన్మించారు. తల్లి మజహరున్నీసా బేగం. తండ్రి షఫీఖుల్లా ఖాన్. అష్ఫాఖుల్లా చిన్నతనంలోనే భారత స్వాతంత్ర్యోద్యమం పట్ల ఆకర్షితులయ్యారు. ఆ క్రమంలో ఆయన అఖిల భారత జాతీయ కాంగ్రెస్ పిలుపు మేరకు జరుగుతున్న కార్యక్రమాలలో చిన్ననాటి నుండి పాల్గొనడం ఆరంభించారు. ఆ తరువాత స్వగ్రామంలోని **అబ్బీ రిచ్ మిషన్ హైస్కూల్‌**లో (Abbie Rich Mission High School) చదువుతున్నప్పుడు అక్కడ జరిగిన సంఘటనలు, అక్కడి విద్యార్థులతో ఏర్పడిన సంబంధాలు, ఆ తరువాత ఇటు జాతీయ స్థాయిలో ఏర్పడిన నూతన పరిణామాలు అటు స్థానికంగా వచ్చి మార్పులు అష్ఫాఖుల్లా ఖాన్‌ను విప్లవోద్యం బాటన నడిపించాయి.

పండిత రాంప్రసాద్ బిస్మిల్ 1897 జూన్ 11న షాజహాన్‌పూర్‌లోని సనాతన బ్రాహ్మణ కుటుంబంలో జన్మించారు. ఆయన తల్లి మూలమతి, తండ్రి మురళీధర్. బిస్మిల్ చిన్ననాటి నుండి ఆర్యసమాజ్ కార్యకలాపాల పట్ల ఆసక్తి పెంచుకున్నారు. ఉర్దూ, హిందీ, ఆంగ్లంలో మంచి ప్రవేశం సంపాదించిన ఆయన కవిత్వం రాశారు. పలు గ్రంథాలను వెలువరించారు.

ఆంగ్లేయ పాలకులు స్వదేశీయుల మీద సాగిస్తున్న పెత్తనాన్ని సహించలేని రాంప్రసాద్ బిస్మిల్ జాతీయోద్యమంలో ప్రవేశించారు. జాతీయోద్యమంలో ఎదురైన పలు సంఘటనల నుండి లభించిన అనుభవాల దృష్ట్యా సాయుధపోరాటం ద్వారా మాత్రమే పరాయి పాలకులను స్వదేశం నుండి వెళ్ళగొట్టగలమన్న నిర్ణయానికి వచ్చారు. ఆనాటి ప్రముఖ విప్లవకారులతో కలసి 'హిందూస్థాన్ రిపబ్లిక్ అసోసియేషన్' ఆరంభించి సాయుధపోరాటం బాటన సాగారు.

అష్ఫాఖ్ చదువుకున్న **అబ్బీ రిచ్ మిషన్ హైస్కూల్** ల్లోనే రాంప్రసాద్ బిస్మిల్ చదువుకున్నారు. అష్ఫాఖుల్లాఖాన్ సోదరులు రియాసతుల్లా ఖాన్, బిస్మిల్ **అబ్బీ రిచ్ మిషన్ హైస్కూల్** ల్లోనే కలసి చదువుకున్న మంచి మిత్రులు. ఒకసారి షాజహాన్‌పూర్ పట్టణం సమీపాన గల 'ఖౌన్నౌత్' నది తీరాన గల ఇసుక తిన్నెల మీద సభ జరిగింది. ఆ సభలో రాంప్రసాద్ బిస్మిల్ ప్రసంగిస్తూ, మాతృభూమి స్వేచ్ఛ కోసం ఎటువంటి త్యాగానికైనా తాను సిద్ధమని ప్రకటిస్తూ యువత కూడా కదలి రావాలని పిలుపునిచ్చారు. ఆ ప్రసంగం అష్ఫాఖ్‌ను ముగ్ధుడ్ని చేసింది. ఆ క్షణాన రాంప్రసాద్ బిస్మిల్ నేతృత్వంలోని 'హిందూస్థాన్ రిపబ్లిక్ అసోసియేషన్' లో సభ్యత్వం చేపట్టడం కోసం ఆష్ఫాఖ్ ప్రయత్నాలు ఆరంభించారు.

అప్పటి నుండి అష్ఫాఖ్ రాంప్రసాద్ బిస్మిల్‌ను కలవడానికి ప్రయత్నించారు. పలుమార్లు ఆయన ప్రయత్నాలు విఫలమయ్యాయి. ఈ విషయాన్ని బిస్మిల్ తన ఆత్మకథలో ప్రస్తావిస్తూ, **నాకు బాగా గుర్తు, చక్రవర్తి క్షమాప్రకటన అనంతరం నేను షాజహాన్‌పూర్ తిరిగి వచ్చినప్పుడు నీవు మొదట నన్ను స్కూలులో కలిసావు. నన్ను కలుసుకోవాలనే కోర్కె నీ మనస్సులో ఎంతగానో ఉండింది. మైనపురి కుట్ర గురించి నాతో కొంత మాట్లాడాలని నీవు కోరావు. స్కూలులో చదివే ఒక ముస్లిం విద్యార్థి నాతో యిలాంటి విషయాల గురించి ప్రస్తావిస్తున్నాడని శంకించి నేను నీ ప్రశ్నలకు ఎంతో ఉపేక్షతో జవాబు ఇచ్చాను. నీకప్పుడు ఎంతో ఖేదం కలిగింది. నీ హృదయంలోని భావాలు నీ ముఖకవళికల్లో స్పష్టంగా గోచరించాయి.** (బిస్మిల్ ఆత్మకథ, హిందీ మూలం : శ్రీ రాంప్రసాద్ బిస్మిల్, తెలుగుసేత: శ్రీ ఇంగువ మల్లికార్జున శర్మ, మార్క్సిస్టు అధ్యయన వేదిక, హైదరాబాదు, 1989, పుట.105).

అష్ఫాఖ్‌కు రాంప్రసాద్ విప్లవ దళంలో సభ్యత్వం లభించలేదు. అష్ఫాఖ్ నిజాయితీని, నిబద్ధతను తొలిదశలో బిస్మిల్ శంకించారు. ఆ కారణంగా అష్ఫాఖ్ పలుమార్లు బిస్మిల్ తిరస్కారానికి గురయ్యారు. చివరకు అష్ఫాఖుల్లా ఖాన్ లక్నో సమావేశంలో రాంప్రసాద్ బిస్మిల్‌ను కలసి మాట్లాడారు. ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ, **అయితే నీవంతటితో విరమించుకోక ధృఢనిశ్చయంతో నిలిచావు. ఏదోవిధంగా వీలు చూసుకుని లక్నో కాంగ్రెసులో నాతో మాట్లాడావు.** (బిస్మిల్ ఆత్మకథ, పుట.105) అని బిస్మిల్ పేర్కొన్నారు. అష్ఫాఖ్ మాత్రం ఏమాత్రం నిరాశచెందక తన ప్రయతాల్నలు కొనసాగించారు. చివరకు రాంప్రసాద్ మెట్టు దిగి అష్ఫాఖ్ అభిష్టాన్ని అంగీకరించక తప్పలేదు.

ఈ విషయాన్ని బిస్మిల్ ప్రస్తావిస్తూ, **నీ మిత్రులతో చెప్పించి నాకు నమ్మకం కలిగించ ప్రయత్నించావు. చివరకు నీవే నెగ్గావు. నీ ప్రయత్నాల వలన నా హృదయంలో నీకు చోటు దొరికింది. పైగా మీ అన్న ఉర్దూ మిడిల్ స్కూల్‌లో నా సహపాఠి, మిత్రుడేన్న సంగతి తెలిసి నాకు మరీ సంతోషమైంది.** అని రాశారు. (బిస్మిల్ ఆత్మకథ, పుట.105). ఆ విధంగా దళంలో సభ్యత్వం లభించడంతో బిస్మిల్-ఆష్ఫాఖ్ మధ్య పటిష్టమైన స్నేహం చిగురించింది.

1921లో అహ్మదాబాద్‌లో జరిగిన భారత జాతీయ కాంగ్రెస్ సమావేశాలకు బిస్మిల్, అష్ఫాఖుల్లా ఖాన్ ఇతర మిత్రులతో కలసి హాజరయ్యారు. ఈ సమావేశంలో మౌలానా హస్రత్ మోహనీ 'సంపూర్ణ స్వరాజ్యం' ప్రతిపాదన ప్రవేశపెట్టారు. ఈ తీర్మానాన్ని పూర్తిగా, యథాతథంగా సమర్థించాల్సిందిగా కోరుతూ మౌలానా చేసిన ప్రసంగం సభికులను ఆకట్టుకుంది. ఈ సందర్భంగా అష్ఫాఖ్, బిస్మిల్ అయన మిత్రులు కలసి మౌలానా మోహనీని సమర్థించారు. ఈ ప్రతిపాదనను మహాత్మా గాంధీ పూర్తిగా వ్యతిరేకించడంతో అది ఆనాడు తీర్మానంగా రూపుదాల్చలేకపోయింది.

ఈ విధంగా అష్ఫాక్-బిస్మిల్ కలసి భారత జాతీయ కాంగ్రెస్ నిర్వహిస్తున్న సభలు, సమావేశాలలో పాల్గొంటూ వచ్చారు. ఆ తరువాత బిస్మిల్ నేతృత్వంలోని 'హిందూస్థాన్ రిపబ్లిక్ అసోసియేషన్' నిర్వహించిన పలు సాహసిక విప్లవకర దాడులలో అష్ఫాఖుల్లా పాల్గొన్నారు. స్వదేశీయులను ఇబ్బందుల పాల్జేసే ఇటువంటి సాహసిక దాడుల వలన ప్రయోజనం ఏమాత్రం ఉండక పోగా ప్రజల మద్దత్తును కొల్పోతామని భావించిన అష్ఫాఖుల్లా తన అయిష్టతను ప్రకటించారు. ప్రజాస్వామికవాది ఆష్ఫాఖుల్లా దళం సభ్యుడిగా దళం ఉమ్మడిగా తీసుకున్న నిర్ణయాన్ని అంగీకరిస్తూ కార్యక్రమాలలో పూర్తిస్థాయిలో పాల్గొనసాగారు.

అష్ఫాఖ్ ఇస్లాం ధర్మానురక్తుడు. బిస్మిల్ ఆర్యసమాజికుడు. హిందూ మతం నుండి ఇతర మతాలలోకి మారిన వారిని 'శుద్ధి కార్యక్రమం' ద్వారా తిరిగి హిందూ మతంలోకి ఆహ్వానించే కార్యక్రమాలను చురుగ్గా నిర్వహిస్తున్న వ్యక్తి రాంప్రసాద్ బిస్మిల్. మత ధర్మాలను బట్టి అష్ఫాక్-బిస్మిల్‌ల ధార్మిక బాటలు వేర్వేరుగా ఉన్నా బ్రిటీష్ పాలకుల కబంధ హస్తాల నుండి మాతృభూమిని విముక్తం చేయాలన్న తిరుగులేని సంకల్పం ఆ ఇరువురి బాటను ఏకం చేసింది. ఆ విధంగా ఏర్పడిన వారిరువురి స్నేహబంధం భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో అపూర్వంగా వెలుగొంది ఆనాటికి-ఈనాటికి ఆదర్శనీయంగా నిలచింది.

ఈ స్నేహబంధం ఆనాడు ఎంత సంచలనం సృష్టించిందో, ఈ యోధుల గురించి బంధుమిత్రులు ఏమనుకున్నారో బిస్మిల్ స్వయంగా తన ఆత్మకథలో, **'ఒక పచ్చి ఆర్య సమాజికునికి, ఒక ముస్లిముకు మధ్య యిలా స్నేహం ఎలా కలిసింది? అని అంతా ముక్కుపై వేలేసుకునే**

**వాళ్ళు. నేను ముహమ్మదీయులను శుద్ధి** (హిందువులుగా మార్పిడి) **చేస్తుండేవాడిని. ఆర్యసమాజ మందిరంలోనే నా నివాసం ఉండేది. కాని నీవీ విషయాలను వేటినీ కించిత్తయినా లెక్కచేయలేదు. నీవు ముహమ్మదీయుడివి కావడం చేత నా మిత్రులు కొందరు నిన్ను తిరస్కారభావంతో చూస్తుండేవారు. కానీ నీవు ధృఢ నిశ్చయంతో నిలిచావు. నన్ను కలుసుకోవడానికి నీవు ఆర్యసమాజ మందిరానికి వచ్చిపోతుండేవాడివి. హిందూ- ముస్లింల కలహాలు చెలరేగినప్పుడు మీ పేటలో అందరూ నిన్ను బాహటంగా దూషించే వారు. కానీ నీ వెప్పుడూ వాళ్ళ అభిప్రాయాలతో ఏకీభవించలేదు',** అని రాసుకున్నారు. (బిస్మిల్ ఆత్మకథ, పుట. 105-106)

ఆర్య సమాజికుడైన బిస్మిల్‌తో స్నేహం వద్దని అష్ఫాక్ మీద ఆయన కుటుంబీకులు, సన్నిహిత మిత్రులు చాలా ఒత్తిడి తెచ్చారు. అష్ఫాఖ్ మాత్రం బిస్మిల్ స్నేహాన్ని వదులుకోలేదు. ఈ ఇరువురు యోధుల మధ్య మాతృదేశ విముక్తి లక్ష్యమే ప్రధాన బంధమని సన్నిహితులు, బంధువులు అర్థం చేసుకోలేకపోయారు. ఆ స్నేహ సంబంధాల స్వభావం తెలియక అష్ఫాఖ్ కుటుంబీకులు మరీ కంగారు పడ్డారు. ఆయనెక్కడ ఇస్లాం మతం వదలి, శుద్ధి చేయించుకుని హిందువైపోతాడో అని భయపడ్డారు. ఒకసారి అనారోగ్యం వలన అష్ఫాఖ్ అపస్మారక స్థితిలోకి వెళ్ళారు. బంధువులు, మిత్రులు కంగారు పడసాగారు. ఆ స్థితిలో కూడా మిత్రుడు బిస్మిల్‌ను **'రామ్...హాయ్... రామ్'** అంటూ అష్ఫాక్ పలవరిస్తూ తన కుటుంబీకులలో కలకలం సృష్టించారు.

ఈ విషయాన్ని బిస్మిల్ వివరిస్తూ, **మీ పేటలో అందరూ నిన్ను బాహాటంగానే విమర్శిస్తూ ఉండేవారు. చివరకు కాఫిర్ అనికూడా పిలుస్తుండేవాళ్లు. కాని నీవెప్పుడూ వాళ్ళ అభిప్రాయాలతో ఏకీభవించలేదు. నీకు నామీద ప్రగాఢ అభిమానం ఉండేది. అయితే నీవు నాపేరును పూర్తిగా పిలువగలిగేవాడివి కాదు. నీవెల్లప్పుడూ నన్ను రామ్ అని సంబోధిస్తుండే వాడివి. ఒకసారి నీవు తీవ్రమైన గుండెదడ** (Palpitation of heart) **వచ్చి అచేతనంగా పడిపోయావు. నీ నోటి నుండి మాటిమాటికి 'రామ్...హాయ్...రామ్' అను శబ్దాలే వెలువడ్డాయి. దానితో నీవద్ద నిలబడ్డ మీ సోదరులు, బంధుజనులంతా యిదేమిటిలా 'రామ్...రామ్' అంటున్నాడని మహాశ్చర్యపడిపోసాగారు. అరే 'అల్లా...అల్లా...అల్లా అనరా' అని నిన్ను కోరసాగారు. కాని నీవు రామ్...రామ్ అనడం మానలేదు. ఈ రామనామ జపం రహస్యం తెలిసిన మిత్రుడొకరు అక్కడికి రావడం, తక్షణమే నన్ను పిలిపించడం జరిగింది. నన్ను కలిసిన తర్వాతే నీకు ఉపశమనం కలిగింది. అప్పుడందరికీ ఈ రామనామ జపం లోగుట్టు ఏమిటో అర్థమైపోయింది!.**, అని వెల్లడించారు. (బిస్మిల్ ఆత్మకథ : పుట. 106).

బిస్మిల్ ఎన్నడూ కూడా తన మతపరమైన భావాల ద్వారా అష్ఫాఖుల్లాను ప్రభావితం చేయలేదు. అష్ఫాఖ్ కుటుంబీకులు ఆయనెక్కడ బిస్మిల్ ద్వారా శుద్ధి చేయబడతాడోనని భయపడసాగారు. ఆ విషయం తెలుసుకున్న బిస్మిల్, **నీ ప్రవర్తన చూసి మీ వాళ్ళంతా, 'వీడెక్కడ**

**మన మతం వదిలి, శుద్ధి చేయించుకుని హిందువై పోతాడో' నని ఆందోళన చెందుతూండే వాళ్ళు. కానీ, నీ హృదయం ఏ విధంగానూ అశుద్ధంగా వుండలేదే, మరి నీవింకే వస్తువును శుద్ధి చేయిస్తా వనుకున్నారు. ఈ విధంగా నీవు సాధించిన ప్రగతి నా హృదయాన్ని పూర్తిగా గెలుచుకున్నది.** (బిస్మిల్ ఆత్మకథః పుట. 106) అని అష్ఫాఖ్ మత మనోభావాల పట్ల బిస్మిల్ గౌరవం వ్యక్తంచేశారు.

రాంప్రసాద్ బిస్మిల్ ఎక్కడుంటే అష్ఫాఖుల్లా ఖాన్ అక్కడుండేవారు. మాతృభూమి విముక్తి పోరాటం తప్ప మరో ధ్యాస లేని ఈ యువకులు ఆదర్శప్రాయమైన స్నేహబంధాన్ని ప్రదర్శించారు. ఒక మహత్తర లక్ష్యాన్ని సాధించేందుకు ఏర్పడిన బంధం జాతి, మత, కుల ప్రాంతాలకు అతీతంగా ఉంటుందని రుజువు చేశారు. దేశాన్ని వలస పాలకుల నుండి విముక్తం చేసేందుకు ప్రారంభమైన సాయుధ పోరాటం మతం, మతధర్మాల బంధనాలను కూడా ఛేదించింది అనడానికి ఈ ఇరువురు విప్లవకారుల ప్రవర్తన, స్నేహం ప్రబల రుజువుగా భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో స్థిరపడింది.

ఈ ఇరువురిని మిత్రులు, బంధువులు మతభ్రష్టులుగా నిందించారు. బిస్మిల్‌ను ఆయన స్నేహితులు హెచ్చరిస్తూ చేసిన వ్యాఖ్యలను ప్రస్తావిస్తూ, '**మా బృందంలో తరచూ నీ గురించి** (అష్ఫాఖుల్లా ఖాన్ గురించి) **చర్చ వచ్చేది. ఏమో నమ్ముతున్నావు... మోసపోయేవు సుమా అని అనేవాళ్ళు...కానీ నీవు నెగ్గావు**' (బిస్మిల్ ఆత్మకథః పుట. 106) అని స్వయంగా బిస్మిల్ చెప్పుకున్నారు. ఆ మిత్రుల సన్నిహితులు, కుటుంబీకులు ఎటువంటి విమర్శలు చేసినా, ఈ మిత్రులిరువురి మధ్య చివరిశ్వాస వరకు చక్కని స్నేహబంధం వర్ధిల్లింది. ఈ విషయాన్ని బిస్మిల్ పేర్కొంటూ, **నేను నీవు అనే తేడా లేకుండా పోయింది మన మధ్య, తరచూ నీవూ నేను ఒకే కంచంలో తిన్నాము,** అని ఆత్మకథలో (పుట. 106) రాసుకున్నారు.

బిస్మిల్ హృదయంలో ముస్లింల పట్ల ఏర్పడిన అపోహలను అష్ఫాఖ్ తన చక్కని ప్రవర్తనతో తుడిచేయగలిగారు. మాతృభూమి విముక్తికి సంబంధించిన అంశం ప్రధాన మైనప్పుడు హిందువైనా, ముస్లిమైనా ఒకే రకంగా స్పందిస్తారని, ఒకే రకంగా త్యాగాలకు సిద్ధపడతారని, ఈ సంసిద్ధతకు త్యాగాలకు మతం ఏమాత్రం అడ్డంకి కాదని కానేరదని అష్ఫాఖ్ తన అచంచలమైన దీక్షతో, చక్కని నిబద్ధతతో, దృఢ దీక్షతో సాక్ష్యం పలికారు. **చివరకు హిందువులు ముస్లింలలో ఏదో తేడా ఉందనే ఆలోచనే నా హృదయం నుండి నిష్క్రమించ సాగింది. నీవు నా మీద ప్రగాఢ విశ్వాసం, అమిత ప్రీతి కలిగి ఉండేవాడివి,** (ఆత్మకథః పుట. 106) అని సనాతన సంప్రదాయానురక్తుడు, ఆర్యసమాజికుడు పండిత రాంప్రసాద్ బిస్మిల్ స్వయంగా అష్ఫాఖుల్లా ఖాన్ గురించి చెప్పుకున్నారు.

మాతృదేశ సేవకోసం విప్లవోద్యమంలో భాగస్వామి కావాలని, కలలు కంటున్న అష్ఫాఖ్‌కు ఆ కలలను పండించుకునే మార్గం పూర్తి స్థాయిలో లభించేసరికి సంతోషం ఉప్పొంగింది. **నేను స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కోరుకునేవాడిని. స్వాతంత్ర్యం కోసం ప్రాణాలను తృణప్రాయంగా భావించి అర్పించడానికి సర్వదా సిద్ధం. బానిసత్వపు వరమాల, అది ఎలాంటిదైనా దానిని ధరించడానికి నేను ఇష్టపడను** అని ప్రకటించుకున్న అష్ఫాఖ్ తన కుటుంబాన్ని, జమీందారిని అన్నిటి వదలిపెట్టి రాంప్రసాద్ బిస్మిల్ వెంట 'హిందూస్థాన్ రిపబ్లిక్ అసోసియేషన్' సభ్యుడిగా విప్లవోద్యమంలోకి పూర్తి స్థాయిలో ప్రవేశించారు.

బిస్మిల్ తొలి దశలో అష్ఫాఖుల్లా ఖాన్‌ను బిస్మిల్ ఎంతగా నిరాకరించినా, చివరకు విప్లవోద్యమం పట్ల అష్ఫాఖ్‌కు ఉన్న నిబద్ధత, ఆయనలోని త్యాగశీలత, కార్యాచరణను గమనించి అంతగా ఆనందించారు. అష్ఫాక్ నడతను, నిజాయితీని, నిక్కచ్చి విప్లవ భావాలను బిస్మిల్ ప్రస్తావిస్తూ, **నా ఆలోచనల రంగు నీకూ అంటుకుంది. నీవు కూడా రాటుదేలిన విప్లవ కారుడవై పోయావు. ఇక అప్పటి నుండి అహోరాత్రులు నీదొక్కటే ధ్యాస...ఒకే ప్రయత్నం ఎలాగైనా సరే ముస్లిం నవయువకుల్లో కూడా విప్లవ భావాలు చొప్పించాలని, వారు కూడా విప్లవోద్యమానికి దోహదపడేట్లు చూడాలని, నీ బంధుమిత్రులు ఎంతమంది ఉన్నారో వారందరి మీద నీ ఆలోచన ప్రభావం వేయడానికి ప్రయత్నించావు...ఒక ముస్లింను విప్లవ పార్టీలో పేరెన్నిక గన్న సభ్యునిగా నేనెట్లా మార్చగలిగానా అని యితర సహచరులంతా కూడా తరుచూ విస్తుపోతూండే వాళ్ళు...నీదెంతో విశాల హృదయం...నీ భావాలు అత్యంత సమున్నతమైనవి**, అని బిస్మిల్ తన ఆత్మకథలో పేర్కొన్నారు. (పుట. 107)

విప్లవదళ సభ్యుడిగా ఎంతటి క్లిష్టతరమైన బాధ్యతలను అప్పగించినా అష్ఫాఖుల్లా ఖాన్ ఎన్నడూ ఎదురాడలేదు. నిర్వహణలో విఫలం కాలేదు. వ్యక్తిగత అభిప్రాయాలు ఎలా ఉన్నా, సంఘం ఉమ్మడి నిర్ణయాలను అష్ఫాఖ్ గౌరవించారు. అయనకు నిర్దేశించిన విధులు, బాధ్యతలను క్రమశిక్షణ గల సైనికునిగా ఆచరణలో పెట్టడం ద్వారా బిస్మిల్‌కు అష్ఫాఖ్ సన్నిహితులయ్యారు. ఈ విషయాన్ని బిస్మిల్ ప్రస్తావిస్తూ, **నీవు నా పట్ల చూపిన నడత ఎంతో ప్రశంసనీయమైనది. నీవెన్నడూ నా అజ్ఞను జవదాటలేదు. ఒక విధేయుడైన కార్యకర్తలా నీవెప్పుడూ నా ఆజ్ఞాపాలన చేసావు. నీవెంతో విశాలహృదయం కలిగినవాడివి. నీ భావాలు సమున్నత మైనవి,** అని ప్రశంసించారు. (బిస్మిల్ ఆత్మకథ : 107)

విప్లవోద్యమం పట్ల దృఢసంకల్పం గల అష్ఫాఖ్ దృఢకాయుడు. మంచి బలశాలి అష్ఫాఖ్‌ను దళ సభ్యునిగా స్వీకరించినందుకు బిస్మిల్ ఎంతో గర్వించారు. అష్ఫాఖుల్లా ఖాన్‌ను మహావీరునిగా పరిగణించారు. ఈ విషయాన్ని గర్వంగా ప్రకటించారు. **నాకిప్పుడు కొంతైనా తృప్తిగా వున్నదంటే, ఈ ప్రపంచంలో నా పేరు ప్రతిష్టల్ని నీవు సముజ్వలం గావించావనే. 'అష్ఫాఖుల్లా విప్లవోద్యమంలో**

**పాల్గొన్నాడు. తోబుట్టువు, బంధు మిత్రులు ఎంతగా వారించినా ఆతడు ఏమాత్రం లెక్కచేయలేదు. అరెస్టయిన పిదప కూడా తన భావాలను వదలుకోకుండా సుదృఢంగా నిలిచాడు' అనే ఈ సంగతి భారతదేశ చరిత్రలో ఎంతో ఉల్లేఖనీయమైనది. శారీరకంగా నీవెలా బలశాలివో, మానసికంగా సైతం అలాగే మహా వీరునిగా నిలిచావు. నీ ఆత్మ మహోన్నతమైనదిని నిరూపించుకున్నావు,** (బిస్మిల్ ఆత్మకథ: పుట. 108) అని బిస్మిల్ సంతోషం వ్యక్తంచేశారు.

అష్ఫాఖుల్లా విప్లవోద్యమానికి తన్నుతాను అంకితం చేసుకోవడంతో ఆగలేదు. విప్లవోద్యమ ఛాయలు తన బంధు-మిత్రుల మీద కూడా ప్రసరింపచేయాలని ప్రయత్నిం చారు. విప్లవకారునిగా తన లక్ష్యాలను, భావాలను సన్నిహితులకు ఎరుకపర్చుతూ వారిని కూడా మాతృభూమి సేవలో పునీతులయ్యేందుకు ప్రోత్సహించారు. ఈ విషయాన్ని బిస్మిల్ ప్రస్తావిస్తూ, **నీ బంధుమిత్రులెంత మంది వున్నారో వారందరి పైన నీ అలోచనలు పడవేయడానికి ప్రయత్నించావు,** (పుట. 107) అని అష్ఫాఖ్ ప్రయత్నాలను ప్రశంసించాడు. **చివరకు ఈ కార్యక్రమాల ఫలితంగా, కోర్టులో నిన్ను నా లెఫ్టినెంటువని పేర్కొన్నారు. ఇక తీర్పు రాసిన న్యాయమూర్తి కూడా నీ మెడలో జయమాల (ఉరిత్రాడు) వేశాడు**, అని బిస్మిల్ పేర్కొన్నారు. (బిస్మిల్ ఆత్మకథ : పుట. 108).

విప్లవకారుల సమావేశాలలో ఇతర మిత్రుల అభిప్రాయాలతో సంబంధం లేకుండా, తన అభిప్రాయాన్ని, స్పష్టంగా సూటిగా ప్రకటించడం అష్ఫాఖుల్లా ఖాన్ అలవాటు. ఒక అంశం మీద చర్చ జరుగుతున్నప్పుడు సహచర విప్లవకారులు ఎంతగా వ్యతిరేకించినా ఆయన మాత్రం తన అభిప్రాయాన్ని నిక్కచ్చిగా వెల్లడించారు. ఒకసారి సమావేశం నిర్ణయాలు తీసుకున్నాక, ఆ ఉమ్మడి నిర్ణయాలను గౌరవించడం, ఆ నిర్ణయాన్ని ఆచరించడంలో ఎంత ప్రమాదం ఉన్నా ఏ మాత్రం ఖాతరు చేయక ముందుకు సాగటం అష్ఫాఖ్ లోని ధైర్యసాహసాలకు, ఉత్తమ ప్రజాస్వామిక లక్షణాలకు సజీవ ఉదాహరణ.

అష్ఫాఖుల్లా ఖాన్ కు విప్లవోద్యమంలో ఒకరికి అనుచరునిగా ఉండడానికి ఏమాత్రం ఇష్టపడలేదు. విప్లవ దళంలోని సభ్యులకు, చివరికి నాయకుడికి కూడా సహచరుడిగా మాత్రమే ఆయన మెలిగారు తప్ప **బిస్మిల్ అనుచరుడు** అనిపించుకోడాన్ని ఇష్టపడలేదు. ఆత్మగౌరవాన్ని కాపాడుకుంటూ, ఆత్మాభిమానానికి ఎటువంటి విఘాతం కలుగన్వికుండా, నికార్సయిన విప్లవకారునిగా అష్ఫాఖ్ విప్లవోద్యమంలో మహా యోధునిగా ఎదిగారు. అష్ఫాఖుల్లా ఖాన్ స్వభావాన్ని, ప్రవర్తనను, ఆత్మాభిమానాన్ని బిస్మిల్ తన ఆత్మకథలో ఉటంకిస్తూ, **నీవు నాకు తమ్ముడి తీరుగా అయినావు. కాని తమ్మునిలా చూసుకున్నా నీకు తృప్తి కలుగలేదు. సరిసమానుడిగా చూడాలని, సమాన స్థాయిలో నా మిత్రుదునిగా లెక్కించబడాలని నీవు కోరుకునేవాడివి. చివరకు అదే అయ్యింది.** (బిస్మిల్ ఆత్మకథ : పుట. 105) అని స్వయంగా రాసుకున్నారు.

ఈ ఇరువరు విప్లవకారుల మధ్య అంతటి గాఢమైన సంబంధాలు ఉండడం వలన 'కాకోరి రైలు సంఘటన' కేసులో ఉరిశిక్ష పడ్డాక, 1927 డిసెంబర్ మాసంలో బిస్మిల్ రాసిన ఆత్మకథలో అష్ఫాఖుల్లా ఖాన్‌తో తనకున్న సంబంధాలను వివరిస్తూ ఒక ప్రత్యేక అధ్యాయం కేటాయించారు. ఆ అధ్యాయంలో అష్ఫాఖుల్లా ఖాన్ గురించి, ఆయన నిబ్బత, సాహసిక ప్రవృత్తి, త్యాగనిరతి, మాతృభూమి పట్ల గల గౌరవాభిమానాల గురించి చాలా వివరంగా ప్రస్తావించారు. ఈ మేరకు బిస్మిల్ 1927 డిసెంబర్ 16 తేది వరకు అనగా తనను మరో మూడురోజుల్లో ఉరి తీయాల్సి ఉండగా అప్పటి వరకు రాసిన ఆత్మకథ సంబంధించిన కాగితాలను బిస్మిల్ తనను ఇంటర్వ్యూ చేయడానికి వచ్చిన శివవర్మ ద్వారా అతి రహస్యంగా జైలు బయటకు పంపించారు. ఆ ఆత్మకథను 'ప్రతాప్' పత్రిక సంపాదకులు శ్రీ గణేష్ శకంర్ విద్యార్థి 1929లో ముద్రించారు. 1939లో ఆ గ్రంథాన్ని బ్రిటిష్ ప్రభుత్వం నిషేధించింది. అప్పటికల్లా ఆ గ్రంథం ప్రజల్లోకి చేరుకుంది. ఆ తరువాత మనకు స్వాతంత్ర్యం లభించాక ఆ గ్రంథం మరోమారు ముద్రితమై ప్రజా బాహుళ్యానికి చేరువయ్యింది.

ఆ గ్రంథంలో అష్ఫాఖుల్లా మీద ప్రత్యేక అధ్యాయం రాయాల్సిన అవసరం ఎందు వచ్చిందో బిస్మిల్ ప్రస్తావిస్తూ **నేనీ కేసులో భాగస్వామినై వహించిన పాత్ర నిర్వహణాక్రమంలో ఎవరెవరి జీవితాల భాధ్యత నా భుజస్కంధాలపై వుండిందో-వాటిలో అధిక భాగం శ్రీ అష్ఫాఖుల్లా ఖాన్‌వారసీకి సంబంధించి వుంది. కనుక ఈ అంతిమవేళ ఆయన గురించి కూడా ఈ చేత్తో నాలుగు మాటలు రాయడం నా కర్తవ్యమని భావిస్తున్నాను,** (పుట.105) 'అష్ఫాఖుల్లా ఖాన్' అధ్యాయాన్ని ప్రారంభించారు. ఈ విధంగా బిస్మిల్ వ్యక్తంచేసిన విషయాల ద్వారా విప్లవోద్యమంలో అష్ఫాఖుల్లా ఖాన్ నిర్వహించిన పాత్ర ఎంతటి ప్రాధాన్యత గలదో, అష్ఫాఖ్-బిస్మిల్ మధ్య ఉన్న గాఢమైన స్నేహసంబంధాలు ఎంత పటిష్టంగా రూపాంతరం చెందాయో అర్థంచేసుకోడానికి ఉపయుక్తం కాగలుగుతున్నాయి.

అష్ఫాఖుల్లా ఖాన్ హిందూ-ముస్లిం ఐక్యతకు ప్రధమ స్థానం కల్పించారు. సమాజంలో ఎటువంటి అసమానతలు లేని స్వాతంత్ర్యం కావాలన్నారు. ఈ విషయంలో మౌలానా అబుల్ కలాం అజాద్ స్థాయిలో హిందూ-ముస్లింల ఐక్యతకు అష్ఫాఖుల్లా ఖాన్-రాంప్రసాద్ ప్రతీకలుగా నిలిచారు. ఈ విషయాన్ని బిస్మిల్ ప్రస్తావిస్తూ, **నీవెప్పుడూ హిందూ-ముస్లిం ఐక్యతనే కాంక్షిస్తూండే వాడివి. నీవొక నిజమైన ముస్లింగా, నిజమైన దేశభక్తునిగా ఉన్నావు.** (ఆత్మకథ : పుట.106) అని అన్నారు. భారతీయులు మతం పేరిట విడిపోయి ఐక్యతకు భంగం కల్గిస్తే ఎట్టి పరిస్థితులలో స్వాతంత్ర్య సాధన సాధ్యం కాదని ఇటు బిస్మిల్ అటు అష్ఫాఖ్ భావించారు. ఆ కారణంగా బ్రిటిషర్ల పెత్తనం నుండి మాతృభూమి విముక్తం కావాలంటే హిందూ-ముస్లింల ఐక్యత అవసరమని అష్ఫాఖ్-బిస్మిల్ దృఢ నిర్ణయానికి వచ్చారు.

ఈ ఈ విషయాన్ని అఫ్ఫాఖుల్లా ఖాన్ ప్రస్తావిస్తూ, **హిందూ-ముస్లింల మధ్యన ఉన్న అనైక్యత పలితంగా బ్రిటీషర్ల పెత్తనం సాగుతుంది. ఈ ఆనైక్యత ఫలితంగా ఇండియా ఆంగ్లేయుల పరమైపోయింది. ఆంగ్లేయులు డబ్బు, పదవులు ఆశ చూపి మనల్ని చీల్చి పబ్బం గడుపుకుంటున్నారు. ఈ విషయంలో పెద్ద పెద్దవాళ్ళు కూడా అతీతంగా లేరు. నేను మరణిస్తున్నాను. నా దేశం కోసం మరణిస్తున్నాను. నా మాట వినండి ఐక్యంగా వ్యవహరించండి,** అని చివరి రోజుల్లో ప్రజలను కోరారు. (Shaheed Asfaqulla Khan Aur Unka Yug, by Sudhir Vidyardhi, Page.119)

ఆనాడు ఆర్యసమాజీకులు శుద్ధి సంఘటనల ద్వారా, ముస్లింలు తబ్లిఖ్ సంస్థల ద్వారా చేస్తున్న మత మార్పిడులను అష్ఫాఖుల్లా నిరసించారు. మనదేశంలో మతం పేరిట జరుగుతున్న సంఘర్షణలు పాలకవర్గాల కుట్రలని హెచ్చరించారు. ఆయనకు విధించిన ఉరిశిక్ష మరో మూడు రోజులలో అమలవుతుందనగా, 1927 డిసెంబరు 16న ఫైజాబాద్ జైలు నుండి దేశవాసులను ఉద్దేశిస్తూ అష్ఫాఖ్ ఒక లేఖ రాసారు. ఆ లేఖలో, **భారతదేశ సోదరులారా మీరు ఏ మతానికి, సంప్రదాయానికి చెందిన వారైనా సరే, దేశసేవలో కృషిచేయండి. వృధాగా పరస్పరం కలహించకండి. అన్ని పనులూ ఒకే లక్ష్యాన్ని సాధించేందుకు సాధనాలు. అలాంటప్పుడు ఈ వ్యర్థపు కోట్లాటలూ, కుమ్ములాటలు ఎందుకు? ఐకమత్యంతో దేశంలోని దొరతనాన్ని ఎదిరించండి. దేశాన్ని స్వతంత్రం చేయండి...చివరగా అందరికి నా సలాం. భారతదేశం స్వతంత్రమగుగాక. నా సోదరులు సుఖంగా ఉందురు గాక**, అంటూ ఆ చారిత్రకమైన లేఖను అష్ఫాఖుల్లా ఖాన్ ముగించారు. (జ్ఞాపకం ఉంచుకోండి ఎప్పుడైనా...(అమర వీరుల ఉత్తరాలు), అనువాదం: జె. లక్ష్మి రెడ్డి, భారత ప్రభుత్వం ప్రచురణలు, న్యూడిల్లీ, 1998, పుట.43).

ఈ మేరకు ఆనాడు అష్ఫాఖ్ పలికిన అజరామరమైన మాటలను ఈనాటి పరిస్థితులకు కూడా మనం అన్వయించుకోవచ్చు. ప్రపంచంలో మన భారతదేశం ఉజ్వలంగా ఎదగాలంటే దేశంలోని ప్రధాన సాంఘిక జనముదాయాలైన హిందూ-ముస్లింల మధ్యన ఐక్యతా భావం మరింత పటిష్టం కావాల్సిన అవరసరం ఎంతైనా ఉంది. హిందూ-ముస్లింల మధ్యన ప్రగాఢమైన ఐక్యతను కాంక్షించిన అష్ఫాఖుల్లా జీవిత చరమాంకం వరకు ఆ దిశగా కృషి చేస్తూ, ఐక్యతకు, స్నేహబంధానికి, పటిష్టమైన లౌకిక వ్యవస్థకు ప్రతీకగా నిలచారు. ఆ కారణంగా ప్రముఖ విప్లవ కారుడు శ్రీ మన్మధనాథ గుప్త, బిస్మిల్ అత్మ కథకు ముందుమాట రాస్తూ, **రాంప్రసాద్, అష్ఫాఖ్‌ల ప్రగాఢ మైత్రి పాత తరహా లౌకికవాదపు అత్యున్నత దశ అని చెప్పవచ్చు**, అని పేర్కొన్నారు. (బిస్మిల్ ఆత్మకథ : పుట.IV).

భారత స్వాంత్యోద్యమ చరిత్రలో సంచలనాత్మక సాహసిక చర్యగా అభివర్ణించబడిన 'కాకోరి రైలు సంఘటన'ను బిస్మిల్ నేతృత్వంలోని పదిమంది యువకుల 'హిందూస్థాన్ రిపబ్లిక్ అసోసియేషన్' దళం 1925 ఆగస్టు 9న నిర్వహించింది. ఈ దళంలోని అష్ఫాఖుల్లా ఖాన్ ఈ

ప్రతిపాదనను తొలుత వ్యతిరేకించారు. ఈ చర్య వలన విప్లవోద్యమానికి నష్టం ఏర్పడగలదన్నది అష్ఫాఖ్ అభిప్రాయం. విప్లవ దళం సభ్యులు ఉమ్మడిగా నిర్ణయం తీసుకోవడం వలన అయిష్టమైనానా ఉమ్మడి నిర్ణయాన్ని గౌరవిస్తూ 'కాకోరి రైలు సంఘటన'లో అష్ఫాఖుల్లా ఖాన్ ఇష్టంగా ప్రధాన పాత్ర నిర్వహించారు. ఆ దళం సభ్యులందరిలో అష్ఫాఖ్ బలశాలి కావడంతో తుపాకులకు, గొడ్డళ్ళకు లొంగని, ప్రభుత్వ ఖజనాను తెస్తున్న 'ఐరన్ చెస్ట్' ను పెద్ద సుత్తితో పలుమార్లు బలంగా మోది 'ఐరన్ చెస్ట్' ను బదాబదలు చేశారు.

అష్ఫాఖుల్లా ఖాన్ ఊహించినట్టుగా విప్లవకారుల మీద, విప్లవోద్యమ సానుభూతిపరుల మీద ఆంగ్ల ప్రభుత్వం విరుచుకపడింది. ఆఘమేఘాల మీద ముందుకు సాగిన ఆంగ్ల ప్రభుత్వం 'హిందూస్థాన్ రిపబ్లిక్ అసోసియేషన్' దళంలోని ప్రముఖులను త్వరితగతిన అరెస్టు చేయగలిగింది. ఈ చర్యలో పాల్గొన్న అష్ఫాఖుల్లా మాత్రం పోలీసుల కన్నుగప్పి అజ్ఞాతంలోకి వెళ్ళిపోయారు. ఆయన పరోక్షంలో ఆంగ్ల న్యాయస్థానం 'హిందూస్థాన్ రిపబ్లిక్ అసోసియేషన్' దళం సభ్యుల మీద విచారణ ఆరంభించింది. ఈ 'కాకోరి రైలు సంఘటన' నాటి నుండి అజ్ఞాతంలోకి వెళ్ళిపోయిన అఫ్ఫాఖ్ మారు వేషాలలో ఆంగ్ల ప్రభుత్వం గూఢాచారులకు, పోలీసులకు చిక్కకుండా రహస్యంగా గడపగలిగారు. చివరకు అఫ్ఫాఖుల్లా ఒక మిత్రుడి నమ్మకద్రోహం వలన ఢిల్లీలో పోలీసులకు పట్టుబడిపోయారు.

అష్ఫాఖ్‌ను నిర్బంధంలోకి తీసుకున్న ఆంగ్ల ప్రభుత్వం ఆయనను నయానా-భయాన నచ్చచెప్పి విప్లవదళం రహస్యాలను రాబట్టాలనుకుంది. భయానా ఎటువంటి ప్రయోజనం కన్పించకపోవడంతో చివరకు నయానా ఆయనను మచ్చిక చేసుకోవాలనుకుంది. అందుకు మతాన్ని అడ్డం పెట్టుకుని డిప్యూటీ పోలీసు సూపరిండెంట్ తస్సద్దిఖ్ హుస్సేన్ ను ఆయన మీద ప్రయోగించింది. ఆ తస్సద్దిఖ్ హుస్సేన్ ఎత్తులు వేస్తూ రాంప్రసాద్ బిస్మిల్ హిందువు, అఫ్ఫాఖుల్లా ముస్లిం కనుక ఈ మత భావాల వైరుధ్యాన్ని ఉపయోగించుకోవాలనుకున్నాడు. అందుకు అనుగుణంగా అష్ఫాఖ్‌కు నచ్చచెప్పే ప్రయత్నం చేస్తూ, **రాంప్రసాద్ బిస్మిల్ ఒక హిందువు. ఆర్యసమాజీకుడు. దేశంలో హిందూ రాజ్యం నెలకొల్పడం వాళ్ళ ధ్యేయం. అది ముస్లింల ప్రయోజనాలకు పూర్తిగా విరుద్ధమైనది. ఒక ముస్లింగా నీవు వారి మతతత్వాన్ని నిరసించి, ప్రభుత్వంతో సహకరించు, కాఫిర్లతో సహకరించడం మన మత సంప్రదాయాలకు పూర్తిగా విరుద్ధం కాబట్టి ఒప్పుదల వాంగ్మూలం ఇచ్చి నీ ప్రాణాలను, అలాగే నీ మతం ప్రయోజనాలను కాపాడుకో,** (బిస్మిల్ ఆత్మకథ : పుట.151) అంటూ తెలివిగా అష్ఫాఖ్‌ను మార్గం మళ్ళించేందుకు శతవిధాల ప్రయత్నించాడు.

అష్ఫాఖుల్లాను లొంగదీసుకునేందుకు ఆ పోలీసు అధికారి మత మనోభావాల ఆసరా చేసుకుంటూ, తాను ముస్లిం కనుక అష్ఫాఖ్ మేలు కోరుకుంటున్నందున తన మాట తప్పక వినమని ఒత్తిడి తెచ్చాడు. ప్రభుత్వాన్ని ఒప్పించి మేలు చేస్తానని హామీల వర్షం కురిపించాడు.

ఆ హితవచనాలను చిరునవ్వుతో అష్ఫాఖుల్లా ఖాన్ విన్నారు. ఆ హిత వచనాలు సాగుతున్న సందర్భంగా, **హిందూ రాజ్యస్థాపన** అంటూ తస్సద్దిఖ్ హుస్సేన్ వాడిన మాటలకు ముందుగా సమాధానమిస్తూ, **మీరు నా క్షేమం కోరి హితవు పలికినందుకు ధన్యవాదాలు. అయితే విప్లవకారులు హిందూ రాజ్యం కోసం ప్రయత్నించినా ఇప్పటి ఆంగ్లేయుల నిరంకుశత్వం కంటే, హిందూ రాజ్యమే ముస్లిం ప్రయోజనాలకు మేలని నేను భావిస్తున్నాను. అయితే యావద్భారత ప్రజల స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం పోరాటమే విప్లవకారుల ధ్యేయమని నాకు తెలుసు**, (బిస్మిల్ ఆత్మకథ: పుట. 151) అని ఖరాఖండిగా చెప్పారు. ఆ సమాధానంతో ఇక చేసేది లేక ఆ పోలీసు అధికారి తప్పుకున్నాడు.

బ్రిటిష్ ప్రభుత్వం, పోలీసు ఉన్నతాధికారులు అంతటితో మిన్నకుండి పోలేదు. ఆ పోలీసు అధికారి ద్వారా మాత్రమే కాకుండా మేజిస్ట్రేట్ అయినుద్దీన్ ద్వారా కూడా అష్ఫాఖ్‌లో మతతత్వ విషబీజాలను నాటి ఆయనను తమ దారికి తెచ్చుకోవాలని సరికొత్తగా ప్రయత్నాలు ఆరంభించారు. ఆ పథకం మేరకు ఓ రోజున మేజిస్ట్రేట్ అయినుద్దీన్ నక్క వినయాలతో, అతి నమ్రత ప్రదర్శిస్తూ అష్ఫాఖ్ చెంత చేరాడు. ఆయన కుటుంబం మంచి చెడులను విచారించాడు. కాకోరి రైలు సంఘటన ప్రధాన కేసులో ఆయన సహచరులకు పడిన ఉరిశిక్షలు, యావజ్జీవిత కారాగారవాస శిక్షలు తదితర కఠిన శిక్షలను గుర్తుకు తెచ్చాడు. భయానా ఏమీ చేయలేకపోవడంతో చివరి అస్త్రంగా మతాన్ని రంగంలోకి తెచ్చాడు.

ఈ సందర్భంగా అయినుద్దీన్ ఎంతో తెలివిగా మాట్లాడుతూ, **ఇదంతా హిందువుల కుట్ర. రాం ప్రసాద్ బిస్మిల్ హిందూ రాజ్యం కోసం పోరాడుతున్నాడు. మీరు ముస్లిం అయిఉండి ఎలా మోసపోయారు?** అంటూ అష్ఫాఖ్ మీద ప్రశ్నలను సంధించాడు. ఆ ప్రశ్న, ఆ ప్రశ్నలోని విభజించి-పాలించు కుతంత్రం, ఆ ప్రశ్నలో దాగి ఉన్న మర్మాన్ని గ్రహించిన అష్ఫాఖ్ ఆ అధికారికి సమాధానమిస్తూ, **రాంప్రసాద్ హిందూ రాజ్యం కోసం పోరాడుతున్నాడన్న విషయం అబద్ధం. ఒక వేళ అది నిజమైతే, బ్రిటీష్ రాజ్యం కంటే హిందూ రాజ్యం మేలు కదా,** అని అన్నారు. (Shaheed Asfaqulla Khan Aur Unka Yug, by Sudhir Vidyardhi, Page.52)

అష్ఫాక్ అంతటితో ఆగలేదు. ఈ కేసులో, **నేనొక్కడినే ముస్లిం కావటంతో నా బాధ్యత మరింత పెరిగింది. నేను ఏదైనా పొరపాటు చేశానా? అది ప్రధానంగా ముస్లింల మీద మా పఠాన్ జాతి జనుల మీద మాయని మచ్చగా మిగిలి పోతుంది. కనుక నన్ను గౌరవప్రదంగా మరణించనివ్వండి** అని కూడా ఆ అధికారితో అన్నారు. (Shaheed Asfaqulla Khan Aur Unka Yug, by Sudhir Vidyardhi, Page.53) ఆ సమాధానాలతో బిత్తరపోయిన ఆంగ్ల ప్రభుత్వాధికారి మరోమాట లేకుండా తోకముడిచాడు.

మాతృభూమి స్వేచ్ఛకోసం కలసి పోరాడుతున్న అష్ఫాఖ్–బిస్మిల్ మధ్య నున్న అపూర్వ స్నేహబంధం రాంప్రసాద్ బిస్మిల్ కోసం ప్రాణత్యాగానికి కూడా అష్ఫాఖుల్లాను పురికొల్పింది. 'కాకోరి రైలు సంఘటన'లో విచారణ జరిపిన ఆంగ్లప్రభుత్వం ఈ కేసులోని విప్లవకారుందరికి కఠిన శిక్షలను విధిస్తూ తీర్పులు వెలువరించింది. ఆ తరువాత దళం సభ్యులందరి అప్పీళ్ళ తిరస్కరించబడి, వారి మీద పలు రకాల శిక్షలు ఖరారయ్యాయి. ఆ సమయంలో ఇక లండన్‌లోని ప్రీవీకౌన్సిల్‌కు అప్పీలు చేసుకోవడం మాత్రమే చివరి అవకాశం మిగిలింది.

ఆ దశలో అరెస్టయిన అష్ఫాఖుల్లా ఖాన్ తన ఆప్తమిత్రుడు, 'హిందూస్థాన్ రిపబ్లికన్ అసోసియేషన్' నాయకుడు రాంప్రసాద్ బిస్మిల్‌ను ఉరిశిక్ష నుండి తప్పించ బూనుకున్నాడు. న్యాయవాదులతో సంప్రదించాడు. మిత్రుడితో మాట్లాడారు. చివరకు నేరాన్ని మొత్తంగా తాను స్వీకరిస్తే బిస్మిల్‌ను కాపాడవచ్చని అభిప్రాయానికి వచ్చారు. మాతృభూమి విముక్తి కోసం పోరాడుతున్న విప్లవకారులు ప్రాణాలు కాపాడుకోవడం కోసం అప్పీలు చేసుకోవడం, క్షమాభిక్ష యాచించడం సరికాదన్నది అష్ఫాఖ్ అభిప్రాయం. ఆ అభిప్రాయం ఎలాగున్నా, తనకు ప్రీవీకౌన్సిల్‌కు అప్పీలు చేయడం ఇష్టం లేకున్నా స్నేహితుడు బిస్మిల్ కోరిక మేరకు అష్ఫాక్ సరేనన్నారు. అప్పీలు చేయడానికి సిద్ధపడ్డారు.

ఆ మేరకు కాకోరి రైలు సంఘటనకు తానే పూర్తిగా బాధ్యుడనని వివరిస్తూ, నేరాన్ని మొత్తాన్ని తన నెత్తిన వేసుకుంటూ ప్రీవికౌన్సిల్‌కు సమర్పించేందుకు అష్ఫాఖుల్లా ఖాన్ ప్రకటన పత్రం తయారు చేశాడు. ఆ అభ్యర్థన పత్రం చూసిన ఆయన న్యాయవాది కృపాశంకర్ హజేలా కంగారు పడిపోతూ ఆ విధంగా ప్రకటన చేసినట్టయితే ఉరిశిక్ష ఖాయమని హెచ్చరించినా అష్ఫాఖ్ వినలేదు. మిత్రుడు, విప్లవోద్యమ నేత బిస్మిల్ కోసం తాను బలికావడానికి సిద్ధపడిన ఆయన తన న్యాయవాది కృపాశంకర్ హెచ్చరికలను ఖాతరు చేయకుండా ఆ వినతి పత్రాన్ని నేరుగా ప్రీవీకౌన్సిల్‌కు పంపుతూ, చారిత్రాత్మక కాకోరి రైలు సంఘటన నేరభారాన్ని, ఆ నేర బాధ్యతను పూర్తిగా తాను స్వీకరిస్తూ ఒప్పుకోలు ఆష్ఫాఖుల్లా ఖాన్ ప్రకటన చేశారు.

ఈ సందర్భంగా అందుకు అభ్యంతరం పెడుతున్న తన న్యాయవాదికి మరింత వివరణ ఇస్తూ, **'ఈ మార్గం కంటక ప్రాయమైనప్పటికి, ఈనాడు దేశం కోసం ప్రాణాలు అర్పించాల్సిన పరిస్థితి చాలా ఉంది. ఇక నేరం అంగీకరించటం అంటారా? నా వరకు నేను నేరం అంగీకరించడానికి సిద్ధమే కాదు, అందరి నేరాలను నా నెత్తిన వేసుకోడానికి కూడా సిద్ధం,'** అని అష్ఫాఖ్ తన విధానాన్ని పునరుద్ఘాటించారు. ఈ మేరకు కాకోరి రైలు సంఘటన నేరభారాన్నీ పూర్తిగా అష్ఫాఖుల్లా ఖాన్ తన నెత్తిన వేసుకున్నాడు. (Shaheed Asfaqulla Khan Aur Unka Yug, by Sudhir Vidyardhi, Page.85)

ఈ విషయం గురించి అష్ఫాఖుల్లా ఖాన్ తన న్యాయవాదితో మాట్లాడుతూ, **'నేను ఎల్లప్పుడు సిపాయిని మాత్రమే. శ్రీ రాంప్రసాద్ బిస్మిల్ మా నాయకుడు.  ఆయన నిష్టగల దేశభక్తుడు. మంచి తెలివితేటలు గల వ్యక్తి. నా ప్రాణాలు అడ్డువేసి ఆయనను రక్షించుకోగలిగితే అది మా పార్టీకి, మా లక్ష్యాల సాధనకు ఎంతో మంచిదౌతుంది. నేను సిపాయిని మాత్రమే. ఆయన ఆలోచనలు, తీరుతెన్నుల విషయంలో నేను ఆయనతో సరితూగలేను. అందువలన ఆయనను రక్షించుకోవాల్సి ఉంది,** అని అన్నారు.  (Shaheed Asfaqulla Khan Aur Unka Yug, by Sudhir Vidyardhi,  Page.86)

ఈ అభ్యర్థన పత్రం తయారి వెనుకల ఉద్దేశ్యం ఏమిటని గుచ్చి గుచ్చి ప్రశ్నించాక అష్ఫాఖ్ తన న్యాయవాదికి మరింతగా సమాధానమిస్తూ, **నిజం ఏమిటంటే  బిస్మిల్ కోరిక మేరకు ఇలా రాసాను. బిస్మిల్ నాతో కలిసినప్పుడు ఈ విధంగా రాస్తే తనకు ఉరిశిక్ష తప్పి, జీవిత ఖైదు పడగలదని అన్నాడు. ఆయనకు మేలు జరుగుతుంది కనుక ఆయన కోరినట్టు చేస్తానని వాగ్దానం చేసాను. ఆయన క్షేమం కోరుతూ అభ్యర్థన పత్రం తయారు చేశాను,** (Shaheed Asfaqulla Khan Aur Unka Yug, by Sudhir Vidyardhi,  Page.86) అని చెప్పారు. ఈ వివరణ విన్న తరువాత కూడా ఆ అప్పీల్‌ను ఎవ్వరికి పంపవద్దని, అలా పంపితే ప్రాణం మీదకు వస్తుందని కృపాశంకర్ అష్ఫాఖుల్లాను తీవ్రంగా హెచ్చరించాడు. ఆప్త మిత్రుడి కోసం బలికావడానికి సిద్ధపడిన అష్ఫాఖుల్లా ఖాన్ తన వినతి పత్రంలో ఎటువంటి మార్పులు చేయకుండా యధావిధిగా ప్రీవీ కౌన్సిల్‌కు పంపివేశారు.

పండిత రాంప్రసాద్ బిస్మిల్ వ్యక్తిగతంగా అష్ఫాఖుల్లా ఖాన్‌ను తమ్ముడిలా, ప్రధాన అనుచరుడిగా చూసుకున్నారు. కాకోరి కుట్ర కేసును విచారించిన బ్రిటీష్ న్యాయాధికారి కూడ అష్ఫాఖ్‌ను బిస్మిల్ ప్రధాన సహచరుడిగా పేర్కొన్నారు. హిందూస్థాన్ రిపబ్లిక్ అసోసియేషన్ నిర్వహించిన పలు యాక్షన్స్‌లో బిస్మిల్‌తోపాటుగా  బాధ్యతలను నిర్వహించిన అష్ఫాఖుల్లా, న్యాయస్థానం విధించిన శిక్షలలో కూడా సమానత్వం అనుభవించారు. బిస్మిల్ మాటను అష్ఫాఖుల్లా ఎన్నడూ జవదాటలేదు. చివరకు బిస్మిల్ ప్రాణానికి తన ప్రాణం అడ్డువేయడానికి కూడా అష్ఫాఖ్ వెనుకాడలేదు. అంతటితో ఆగకుండా తనకు ఇష్టం లేకున్నా క్షమాభిక్ష పత్రాన్ని పంపటానికి కూడా అష్ఫాఖుల్లా ఖాన్ సిద్దమయ్యారు.

ఆంగ్ల న్యాయస్థానం ఇచ్చిన తీర్పుకు వ్యతిరేకంగా ప్రజల, ప్రజాప్రతినిధులు చేసుకున్న విజ్ఞప్తులు అన్ని స్థాయిలలో తిరస్కరించబడ్డాక, చివరకు ఆంగ్ల ప్రభుత్వాధినేతకు క్షమాభిక్ష పత్రాన్ని పంపేందుకు ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి. ఉరిశిక్షలు పడిన వారంతా క్షమాభిక్ష కోరుతూ వినతిపత్రాలు పంపుతున్నారు. అష్ఫాఖ్ మాత్రం ఆ విధంగా క్షమాభిక్ష కోరడానికి అంగీకరించలేదు. దేవుని మీద అపార విశ్వాసం గల అష్ఫాఖ్ ప్రతిదీ దేవుని ఇచ్ఛానుసారంగా

జరుగుతుందని, దేవుడు తన పాత్రను ముగించదలిచాడని, ఆ కారణంగానే తనకు ఉరిశిక్ష పడిందని, అందువలన ఆ శిక్షను స్వీకరించడానికి తాను సిద్ధంగా ఉన్నానని బంధుమిత్రులకు రాసిన లేఖలో పేర్కొన్నారు.

మాతృదేశం కోసం ప్రాణాలర్పించటం అదృష్టంగా భావిస్తున్నానని, ఆ అవకాశం తనకు దక్కినందుకు దేవునికి కృతజ్ఞతలు తెలుపుకుంటున్నానని సహచరులతో అన్నారు. ఉరిశిక్షను దైవప్రసాదితంగా అష్ఫాఖుల్లా ఖాన్ భావించినందున, చక్రవర్తికి క్షమాభిక్ష పెట్టుకోడానికి ససేమిరా అంగీకరించ లేదు. మిత్రుడు బిస్మిల్ ఊరుకోలేదు. అష్ఫాఖ్ మీద ఒత్తిడి తెచ్చారు. చివరకు అష్ఫాఖ్ అయిష్టంగానే క్షమాభిక్ష పత్రం పంపారు. ఈ విధంగా అష్ఫాఖ్ మీద ఒత్తిడి తెచ్చి, ఆయన ఇష్టానికి వ్యతిరేకంగా, ఆయన చేత క్షమాబిక్ష అభ్యర్థన పత్రం పంపించినందుకు, ఆ తరువాత బిస్మిల్ తన పశ్చాత్తాపం ప్రకటించారు.

ఈ విషయాన్ని ఆత్మకథలో బిస్మిల్ తన పశ్చాత్తాపాన్ని ప్రకటిస్తూ, **అష్ఫాఖుల్లా ఖానైతే బ్రిటీష్ ప్రభుత్వాన్ని క్షమాభిక్ష యాచించేందుకు సమ్మతించలేదు. దయామయుడైన ఆ దేవుని తప్పించి మరో వ్యక్తినెవరినీ క్షమాభిక్ష కోరరాదని ఆయన అచంచల విశ్వాసం. కానీ నేను మరీ పట్టుబట్టడంతో ఆయన కూడా క్షమాభిక్ష కోరాడు. నా పవిత్ర ప్రేమ ప్రసాదించిన అధికారాల్ని వినియోగించి నేను అష్ఫాఖుల్లా ఖాన్‌ను తన దృఢనిశ్చయం నుండి విచలితుడయ్యేలా చేశాను. గనుక దీని దోషమంతా నాదే...గోరక్‌పూర్ జైలు నుండి అష్ఫాఖుల్లా ఖాన్‌కు నేనొక లేఖ రాసి నన్ను క్షమించాల్సిందిగా కోరాను,** అన్నారు. (బిస్మిల్ ఆత్మకథ : పుట. 137)

రాంప్రసాద్ బిస్మిల్ చివరి సందేశాన్ని **విద్రోహి** కలం పేరుతో సర్దార్ భగత్‌సింగ్ 1928 నాటి **కీర్తి** పత్రికలో ఇదే విషయాన్ని రూఢిగా ప్రకటిస్తూ, **నేను చెబుతున్నట్టుగానే, అష్ఫాఖుల్లా ఆలోచనలూ ఉన్నాయి. అప్పీలు రాస్తున్నప్పుడు లక్నో జైలులో నేను అతనితో మాట్లాడాను. ప్రభుత్వానికి దయాభిక్ష పత్రం సమర్పించటం తనకు** (అష్ఫాఖ్) **ఎంత మాత్రమూ యిష్టం లేదు. నేను బలవంతం చేయటం వల్ల, నా మాటను కొట్టెయ్యలేక చివరికి అష్ఫాఖుల్లా అంగీకరించాడు**, (జ్ఞాపకం చేసుకోండి ఎప్పుడైనా : పుట. 28 మరియు 40) అని బిస్మిల్ చెప్పినట్టుగా రాశారు.

అష్ఫాఖుల్లా ఖాన్ మాతృభూమి విముక్తి పోరాటంలో మృత్యువును కౌగలించుకోడాన్ని ఎంతో గర్వంచదగిన పవిత్రమైన విషయంగా ప్రకటించారు. ఉరికి రెండు రోజుల ముందు ఆయనను కలుసుకోడానికి వచ్చిన బంధువులతో ఆయన మాట్లాడుతూ, ' Today I feel myself worthy of honour with the hope that a sacred and great responsibility for the liberation of motherland has been entrusted to me...you should feel happy and proud that one of yours is fortunate enough for offer his like...to the monther land...' (Freedom Movement and Indian Muslim, Santimony Ray, PPH. Newdelhi, 1983, Page: 43) అన్నారు.

ప్రజల వేడుకోళ్ళు ప్రభుత్వాన్ని కదిలించలేకపోయాయి. ప్రజా నాయకుల వినతులు బుట్టదాఖలయ్యాయి. ఆ క్షమాభిక్ష విజ్ఞప్తులు తిరస్కరించబడ్డాయి. చివరకు ప్రధాన కేసులోగాని, అనుబంధ కేసులోగాని విచారణ ఎదుర్కొన్న కాకోరి యోధులలో రాంప్రసాద్ బిస్మిల్, ఠాకూర్ రోషన్ సింగ్, రాజేంద్ర లహరి, అష్ఫాఖుల్లా ఖాన్‌కు ఉరిశిక్షలు ఖరారయ్యాయి. 1927 డిసెంబరు 19న అష్ఫాఖుల్లా ఖాన్‌ను ఫైజాబాద్ జైలులో, రాంప్రసాద్ బిస్మిల్‌ను గోరఖ్‌పూర్ జైలులో ఉరితీయాలని కోర్టు ఆదేశించింది. ఆ ఆదేశాల ప్రకారంగా అష్ఫాఖుల్లా ఖాన్‌ను లక్నో కారాగారం నుండి ఫైజాబాద్ జైలుకు తరలించారు.

ఈ విధంగా అష్ఫాఖుల్లా ఖాన్, రాంప్రసాద్ బిస్మిల్ ఇరువురు ఆదర్శప్రాయమైన స్నేహబంధాన్ని, సమరయోధుల ధర్మాన్ని ప్రదర్శించారు. మహత్తర లక్ష్యాన్ని సాధించేందుకు ఏర్పడిన మిత్రత్వం జాతి, మత, కుల ప్రాంతాలకు అతీతంగా ఉంటుందని ఆచరణాత్మకంగా రుజువు చేశాడు. ఈ ఇరువురిని మిత్రులు, బంధువులు మతభ్రష్టులుగా నిందిస్తున్న అష్ఫాఖ్-బిస్మిల్ తమలోని నికార్సయిన నిజాయితీని, స్వచ్ఛమైన స్నేహసంబంధాలను స్వయంగా ప్రకటించారు, ప్రవర్తించారు. చివరివరకు మతాలకు అతీతంగా వ్యవహరించిన అష్ఫాక్-బిస్మిల్ మిత్రద్వయం మాతృభూమి విముక్తి పోరాటంలో కలసి మెలసి పాల్గొనటం మాత్రమే కాకుండా కంటక ప్రాయమైన ఆ మార్గంలో ఎదురైన అన్ని కష్ట నష్టాలతోపాటు చివరకు ఉరిశిక్షలను కూడా సంతోషంగా స్వీకరించి చిరస్మరణీయులయ్యారు.

చివరి రోజుల్లో కూడా మత ప్రసక్తి లేకుండా భారతీయులంతా కలసిమెలసి ఉండాల్సిందిగా ఇటు అష్ఫాఖుల్లా ఖాన్ అటు రాంప్రసాద్ బిస్మిల్ ప్రజలను కోరారు. 1927 డిసెంబరు 19న ఉత్తరప్రదేశ్‌లోని ఫైజాబాదు జైలులో ఉరి తీస్తారనగా, డిసెంబరు 16న జైలు నుండి దేశవాసులను ఉద్దేశిస్తూ ఒక లేఖ రాశాడు. ఆ లేఖలో, **'భారతదేశ సోదరులారా మీరు ఏ మతానికి, సంప్రదాయానికి చెందిన వారైనా సరే, దేశసేవలో కృషిచేయండి. వృధాగా పరస్పరం కలహించకండి. అన్ని పనులూ ఒకే లక్ష్యాన్ని సాధించేందుకు సాధనాలు. అలాంటప్పుడు ఈ వ్యర్థపు కోట్లాటలూ, కుమ్ములాటలు ఎందుకు? ఐకమత్యంతో దేశంలోని దొరతనాన్ని ఎదిరించండి. దేశాన్ని స్వతంత్రం చేయం...చివరగా అందరికి నా సలాం. భారతదేశం స్వతంత్రమగుగాక. నా సోదరులు సుఖంగా ఉందురు గాక'**, అంటూ తన ఆకాంక్షను వ్యక్తంచేస్తూ ఆ అష్ఫాఖుల్లా ఖాన్ చారిత్రకమైన లేఖను ముగించారు. అమరగతి పొందబోతున్న తన సహచరుల పక్షాన ప్రజల నుద్దేశించి ప్రకటన చేస్తూ We shall be born agian, shall meet again and shall jointly fight once again for the cause of the motherland as comrades-in-arms (Freedom Movement and Indian Muslim,Page : 43) అని రాంప్రసాద్ బిస్మిల్ తన అభిష్టాన్ని ప్రకటించారు. మాతృభూమి విముక్తం కోసం మళ్ళీ మళ్ళీ జన్మించి పరాయి పాలకుల మీద సాయుధ పోరాటం

చేద్దామన్న బిస్మిల్ అభిమతాన్ని గౌరవిస్తూ, ఒక ముస్లింగా తనకు పునర్జన్మ లేనందున, **'ఆ దేవుడి దర్శనం కలిగినట్టయితే మాతృభూమి కోసం మరోసారి పోరుబాటన బలయ్యేందుకు స్వర్గం బదులుగా నాకు పునర్జన్మ ఇవ్వమని అర్థిస్తా'** అని అష్ఫాఖుల్లా ఖాన్ ప్రకటించారు.

1927 డిసెంబర్ 19న ప్రాతఃకాల సమయంలో అష్ఫాఖుల్లా ఖాన్ ను ఉత్తరప్రదేశ్ రాష్ట్రం ఫైజాబాద్ జైలులో, పండిత రాంప్రసాద్ బిస్మిల్‌ను ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని గోరక్‌పూర్ జైలులో ఆంగ్ల ప్రభుత్వం ఉరితీసింది. ఆ చివరి క్షణాలలో **'నా మాతృభూమి కలకాలం స్వతంత్రంగా... సౌభాగ్యవంతంగా ఉండాలి...నాదేముంది నేను ఉండొచ్చు. ఉండకపోవచ్చు'** అని సౌభాగ్యవంతమైన స్వతంత్ర భారతాన్ని కలలు కంటూ 27 ఏండ్ల వయస్సులో అష్ఫాఖ్ ఈ లోకం నుండి నిష్క్రమించగా, **'మరణిస్తారు అన్యాయంగా బిస్మిల్, రోషన్, లాహిరి, అష్ఫాఖ్-నేల యీనినట్టు పుట్టుకొస్తారు-మా నెత్తుటి ధారలనుండి వందలాది యోధులు'** అని కవితాత్మకంగా సాయుధ పోరాటం భవిష్యత్తును, పరాయి పాలకుల నుండి మాతృభూమి విముక్తిని ప్రకటించిన రాంప్రసాద్ బిస్మిల్ 30 సంవత్సరాలకు చివరిశ్వాస విడిచారు. ఈ విధంగా పవిత్ర లక్ష్యం, లక్ష్యసాధనా మార్గం ఒక్కటిగా నిర్ణయించుకుని ఏకోన్ముఖంగా సాయుధపోరాట బాటన సాగిన అష్ఫాఖుల్లా ఖాన్, పండిత రాంప్రసాద్ బిస్మిల్ స్నేహసంబంధాల విషయంలో ఆదర్శనీయులయ్యారు.

## ఆధార గ్రంథాలు

01. Gnapakam Chesukondi, Eppudina. Amara veerul Uttharaalu (Telugu), Translation by J.Lakshmi Reddy, Govt. of Indian Publications, New Delhi, 1998.
02. Bismil Athma Kadha, (Telugu) Ramprasad Bismil, Translated by Inguva Malli karjuna Sarma, Marxist Adhayana Vedika, Hyderabad, 1989.
03. Shaheed Ashafhaqulla Khan our Unkaa Yug (Hindi), Sudheer Vidyardhi, Allahabad, 1980.
04. Great Revolutionary Martyr Ashafhaqulla Khan, Basha Sangam, Allahabad, 2001.
05. Remembering Ashfhaqulla Khan - A forgotten Revolutionary (English). KK Khullar, 2000.
06. Shaheed-e-Azam Ashfhaqhulla Khan (Telugu), Syed Naseer Ahamed, AHP, Undavalli, 2006.



భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింల మహత్తర పాత్రను వివరిస్తున్న

# సయ్యద్ నశీర్ అహమ్మద్

**చరిత్ర గ్రంథాలు**

## భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లింలు




భారత స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న ముస్లిం జనసముదాయాల త్యాగాల చరిత్రను సంక్షిప్తంగా వివరిస్తుంది. 1757 నుండి 1947 వరకు బ్రిటీష్ వ్యతిరేక పోరాటాలలో భాగంగా సాగిన ప్రధాన ఘట్టాలలో ముస్లింల పాత్రకు సంబంధించిన విలువైన సమాచారాన్ని క్లుప్తంగా అందిస్తుంది.

**(ఏడవ ప్రచురణ, 1/8 డెమ్మీ సైజు, పేజీలు : 72, మల్టికలర్ టైటిల్, వెల : రు. 25)**

## మైసూరు పులి : టిపూ సుల్తాన్




బ్రిటీష్ పాలకుల సామ్రాజ్యవిస్తరణ కాంక్షను ఆదిలోనే గ్రహించి స్వదేశీ పాలకులను హెచ్చరించడమే కాకుండా, జీవిత చరమాంకం వరకు పరాయి పాలకులతో పోరాడిన తొలితరం జాతీయవాది, మైసూరు పులిగా ఖ్యాతిగాంచిన టిపూ సుల్తాన్ జీవిత చరిత్రను విలువైన చిత్రాలు, ఫోటోలతో ఆవిష్కరిస్తుంది.

**(ఏడవ ప్రచురణ,1/8 డెమ్మీ సైజు, పేజీలు : 69, మల్టికలర్ టైటిల్, వెల : రు. 25)**

## షహీద్-యే-ఆజం అష్ఫాఖుల్లా ఖాన్




సర్దార్ భగత్‌సింగ్‌కు స్ఫూర్తిగా నిలచిన విప్లవకారుడు, స్వాతంత్ర్యోద్యమంలో సంచలనం సృష్టించిన 'కాకోరి రైలు' సంఘటనలో ప్రధాన పాత్ర పోషించి, 27 ఏండ్ల వయస్సులో ఉరిశిక్షను ఆనందంగా స్వీకరించిన యోధుడు అష్ఫాఖుల్లా ఖాన్ ఫోటోలతో కూడిన పోరాట చరిత్రను వెల్లడిస్తుంది.

**(ఐదవ ప్రచురణ,1/8 డెమ్మీ సైజు, పేజీలు : 72, మల్టికలర్ టైటిల్, వెల : రు. 25)**

## భారతస్వాతంత్ర్యోద్యమం:ముస్లిం ప్రజాపోరాటాలు




బ్రిటీష్ పాలకులకు వ్యతిరేకంగా 1765 ప్రాంతం నుండి సాగిన ప్రజా పోరాటాలలో ప్రధానమైన బెంగాల్ సన్యాసులు–ఫకీర్ల ఉద్యమం, వహాబీ యోధుల తిరుగుబాట్లు, ఫరాజీవీరుల విజృంభణ, మలబారు మోప్లాల వీరోచిత పోరాటం, ఖుదా–యే–ఖిద్మత్‌గార్ల అహింసోద్యమ చరిత్రను వివరిస్తుంది.

**(ప్రథమ ప్రచురణ. 1/8 డెమ్మీ సైజు, పేజీలు :168, మల్టికలర్ టైటిల్, వెల : రు.50)**



## భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లిం మహిళలు

భారత స్వాతంత్రోద్యమంలో విశిష్ట త్యాగాలతో, అపూర్వ ధైర్య సాహసాలతో ఆంగ్లేయుల మీద ఉద్యమించిన ముస్లిం మహిళల జీవితగాధలను దృశ్యీకరిస్తుంది. 1857 నుండి 1947 వరకు సాగిన వివిధ పోరాటాలలో భాగస్వాములైన 61 మంది మహిళా యోధుల విశేషాలను అందజేస్తుంది.

**(తృతీయ ప్రచురణ, 1/8 డెమ్మీ సైజు, పేజీలు :286, మల్టికలర్ టైటిల్, వెల: రు.160)**



## భారత స్వాతంత్ర్య సంగ్రామం : ముస్లిం యోధులు -1

1757లో బ్రిటీషర్ల పెత్తనానికి వ్యతిరేకం ఆరంభించిన పోరాటం నుంచి, ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం, జాతీయోద్యమంలో పాల్గొని ఆంగ్లేయాధికారులతో, ప్రభుత్వంతో తమదైన మార్గంలో పోరాటాలు, ఉద్యమాలు సాగించిన 35 మంది పోరాటాల యోధుల సమగ్ర వివరాలతోపాటు, అరుదైన చిత్రపటాలను అందిస్తుంది.

**(ప్రథమ ప్రచురణ, 1/8 డెమ్మీ సైజు, పేజీలు : 316, మల్టికలర్ టైటిల్, వెల : రు. 100)**



## చిరస్మరణీయులు (బ్రిటీష్ వ్యతిరేక పోరాటాల్లో పాల్గొన్న ముస్లిం యోధులు)

1757 నుండి 1947 వరకు సాగిన బ్రిటీష్ వ్యతిరేక పోరాటాలలో పాల్గొన్న ముస్లిం పోరాట యోధులలో ఎంపిక చేసిన 100 స్వాతంత్ర్యసమరయోధుల జీవిత రేఖాచిత్రాలు, ఆ యోధుల అమూల్యమైన ఫోటోలు, పలు చిత్రాలు ఉన్నాయి. అలనాటి యోధుల త్యాగపూరిత చరిత్రను సాధికారికంగా క్లుప్తంగా తెలుపుతుంది.

**(ద్వితీయ ప్రచురణ, 1/8 డెమ్మీ సైజు, పేజీలు : 224, మల్టికలర్ టైటిల్, వెల : రు. 100)**



## 1857 : ముస్లింలు

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ముస్లింల అపూర్వ భాగస్వామ్యాన్ని, ఆనాడు వ్యక్తమైన బలమైన హిందూ– ముస్లింల ఐక్యతను, ఆంగ్లేయుల హింసాకాండ, విస్మరణకు గురైన ముస్లింల త్యాగాలు, త్యాగాలు ఒకరు చేస్తే భోగాలు మరొకరు అనుభవిస్తున్న తీరు తెన్నులను సరికొత్త కోణంలో ప్రజల్లో చర్చకు పెడుతూ  అలనాటి పలు ఆసక్తికర అంశాలను సవివరంగా, విమర్శనాత్మకంగా వివరిస్తుంది.

**(ద్వితీయ ప్రచురణ, 1/8 డెమ్మీ సైజు, పేజీలు : 304, మల్టికలర్ టైటిల్, వెల : రు. 130)**

## అక్షరశిల్పులు (ముస్లిం కవులు-రచయితల సంక్షిప్త పరిచయం)




తెలుగులో రాసిన, రాస్తున్న మూడువందల ముప్పై మూడు (333) మంది ముస్లిం కవులు, రచయితలు, అనువాదకుల వ్యక్తిగత, సాహిత్య వివరాలు, అందులో సుమారు 257 మంది ఫోటోలు, పూర్తి చిరునామా, ఫోన్ నంబర్లు, ఈ–మెయిల్ ఐడిలతో కూడిన సమాచారం ఇందులో లభ్యం. తెలుగు వాఙ్మయ చరిత్రకారులచే 'నభూతో–నభవిష్యతి' అని ప్రస్తుతించబడి, అరుదైన సమాచారం అందిస్తుంది.

(ద్వితీయ ప్రచురణ, 1/8 డెమ్మీ సైజు, పేజీలు : 184, మల్టికలర్ టైటిల్, వెల : రు. 150)

## భారత స్వాతంత్ర్యోద్యమం : ఆంధ్రప్రదేశ్ ముస్లింలు




భారత స్వాతంత్ర్యోద్యమంలో ఆంధ్రప్రదేశ్ ముస్లింల మహత్తర పాత్రను దర్శింపజేయగల పుస్తకమిది. 1780 నాటితో ఆరంభమై 1857 తొలి తిరుబాటు నుండి 1948 వరకు సాగిన పోరాటాల సమగ్ర వివరాలున్నాయి. యాభై మంది యోధుల జీవిత చరిత్రలు, సుమారు మూడు వందల మందికి పైగా జాతీయోద్యమకారుల సంక్షిప్త సమాచారం, అరుదైన చిత్రాలు ఉన్నాయి. రాష్ట్రంలోని, దేశంలోని ప్రముఖ రచయితలు, చరిత్రకారులచే ప్రస్తుతించబడింది.

(తృతీయ ప్రచురణ, 1/8 డెమ్మీ సైజు, పేజీలు : 394, మల్టికలర్ టైటిల్, వెల : రు. 250)

## కువైట్ కబుర్లు

'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సోసైటీ' కువైట్ ఆహ్వానం మేరకు 'అరవై ఆరవ భారత గణతంత్రదినోత్సవం', 'సోసైటీ' 30వ వార్షికోత్సవ సంబరాల సందర్భంగా 2015 జనవరి 28 నుండి ఫిబ్రవరి 5 వరకు సయ్యద్ నశీర్ అహమ్మద్ 'కువైట్'లో పర్యటించారు. అ సందర్భంగా వివిధ సభలు, సమావేశాలు, పలు ఇతర కార్యక్రమాలలో పాల్గొన్న ఆయన తాను చూసిన ప్రదేశాలు, కలసిన మనుషులు, సంస్థలు, చేసిన ప్రసంగాలు, కువైట్ చరిత్ర, విశేషాలు, 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సోసైటీ' కువైట్ మరియు కడప సంస్థల ఆవిర్భావ సమాచారం తదితర విశేషాంశాల గురించి క్లుప్తంగా చెప్పుకొచ్చిన 'కువైట్ కబుర్లు' ఉన్నాయి. 'అల్–ఫారూఖ్ పబ్లికేషన్స్, కడప' ప్రచురణ.




ప్రథమ ప్రచురణ, 1/8 డెమ్మీ సైజు, పేజీలు : 126 , మల్టికలర్ టైటిల్, వెల : రు. 40)




## చరితార్థులు

1757 నుండి 1947 వరకు బ్రిటిష్ వలస పాలకులకు వ్యతిరేకంగా సాగిన పోరాటాలలో పాల్గొన్న భారత ఉపఖండంలోని 155 మంది ముస్లిం యోధుల చిత్రపటాలు, తెలుగు-ఆంగ్ల భాషల్లో ఆయా యోధుల సంక్షిప్త వివరాలతో కూడిన వినూత్న ఆల్బమ్.

**(1/4 డెమ్మీ సైజు, పేజీలు : 352, మల్టికలర్ టైటిల్, మౌంట్ బౌండ్, జాకెట్, వెల : రు. 1000. )**

## THE IMMORTALS

Album of 155 Portraits & brief biographical sketches of Muslim Heroes of Indian sub-continent who fought against the British Colonial Rulers from 1757 to 1947. Brief details of each Freedom Fighter is provided in Telugu and English.

**(1/4 Demmy in Size, Pages-352, Multi colour Title, Mount Bound, Jacket, Rrice Rs. 1000-00)**

### త్వరలో వెలువడనున్న
### సయ్యద్ నశీర్ అహమ్మద్ గ్రంథాలు

01. అజాద్ హింద్ ఫౌజ్ (భారత జాతీయ సైన్యం) : ముస్లిం పోరాట యోధులు
02. దక్షణ భారత కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాత : దాదా అమీర్ హైదర్ ఖాన్
03. చిరస్మరణీయులు - 2
04. భారత స్వాతంత్ర్యసంగ్రామం : ముస్లిం యోధులు - 2, 3, 4
05. భారతీయ ముస్లిం సమాజం : అపోహలు-వాస్తవాలు
06. చరిత్ర సృష్టించిన ముస్లిం మహిళలు
07. భారతీయ ముస్లింలు - స్థితిగతులు
08. మాతృభూమి సేవలో కృతార్థులైన ముస్లిం ముద్దు బిడ్డలు

**ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్**

3-506, అప్పాపురం, ఉండవల్లి సెంటర్-522501,

తాడేపల్లి మండలం, గుంటూరు జిల్లా

సంచారవాణి : 9440241727

naseerahamedsyed@gmail.com
syednaseerahamed2015@gmail.com

**We are very much thankful to the following Philanthropists without whose support we could not have published this Booklet.**



**Mr. Shaik Hussain,**
Ex MLC, Poet and Story Writer
Kadapa.

**Mr. Tummurukunta Siva Sankar**
Retired Police Officer
Kadapa.





**Mr M. Kishore Kumar**
Vice President : Youthwelfare AP
Vijayawada.

**Mr. M. Farooq Shubli**
President: Youthwelfare AP
Cheif patron: YWTS,Vijayawada.





**Mr Shaik Muneer Ahamed**
President: Muslim Development
Society, Vijayawada

**Mr. K. Ravi Kanth Kumar**
Shree Square, A Boutique Hotel
Vijayawada.





**Mr. Irugu Guruswamy**
Senior Advocate
Thirupathi

**Mr. Syed Shamsher**
President: Aam Insaf Muslim
Samaj (AIMS), Thirupathi





**Mr Syed Jalaluddin Zafar**
President : Youthwelfare,
Telangana, Hyderabad.

**Mr. Santhosh Gatla**
Joint Secretary: Youthwelfare
Telangana. Hyderabad.




**AZAD HOUSE OF PUBLICATIONS**
# 3 - 506, APNAGHAR, UNDAVALLI CENTRE-522 501,
TADEPALLI MANDALAM, GUNTUR Dist., ANDHRAPRADESH.
Cell: 94402 41727, E-mail: naseerahamedsyed@gmail.com